# కిసాన్ మజ్దూర్ పక్షం ప్రత్యేక సత్యాగ్రహం

## హైదరాబాద్‌లో 7 గురి అరెస్టు

[స్వకీయ విలేఖరి]

హైదరాబాద్, సెప్టెంబర్ 29: సంస్థాన కాంగ్రెస్‌లోని కిసాన్ మజ్దూర్ పక్షంవారి కార్యక్రమానుసారం పి. శ్రీనివాసరావు, ఆకుల రామయ్య, ఇ. శ్రీనివాసరావు, కె. రత్నేశ్వరరావు, ఎ. ఎల్లయ్యలు నిన్న ఉదయం 7-30 కు మహేశాబాద్‌లో సత్యాగ్రహం చేశారు. వారు కార్మికుల సభలో ఉపన్యసించబోతుండగా పోలీసులు వారిని అరెస్టు చేశారు.

అక్టోబర్, 28 న బాధ్యతాయుత ప్రభుత్వదినము జరుపవలెనని కిసాన్ మజ్దూర్ పక్షంవారు రెండువారాల క్రిందట ప్రకటించిన సంగతి తెలిసినదే.

నిన్న ఉదయం 11 గంటలకు సుల్తాన్ బజార్ గడియారం సంధివద్ద సత్యాగ్రహము చేసినందుకు పి. రామిరెడ్డి, నారాయణగార్లు అరెస్టు అయినారు. అంతకుముందు రామిరెడ్డిగారు తామిది దినంగాసత్యాగ్రహం చేయదలచినట్లు సుల్తాన్ బజార్ పోలీస్ స్టేషన్‌కు ఒక మంచి సిఫార్సు కబురంపారు. ఆ మనిషి సత్యాగ్రహం ఎక్కడావున్నదీ తెలుపజాలనందున పోలీసులు అతనిని కొట్టారు. సుల్తాన్‌బజార్‌లో నిన్న సాఫల్యం మూసివేశారు.

### రామానంద తీర్థగారి కార్యదర్శి అరెస్టు

సంస్థానకాంగ్రెస్ అధ్యక్షుడు స్వామి రామానందతీర్థగారి ఆంతరంగిక కార్యదర్శి పంగ్రేకర్ గారిని మొన్న రాత్రి పోలీసులు అరెస్టుచేశారు.

మహబూబ్ నగర్ హైస్కూలులోని హిందూవిద్యార్థులందరూ ఈ 15 వ తేదీ నుంచీ సమ్మెచేస్తూ వున్నారు. 15 మంది విద్యార్థులు పోలీసు కస్టడీలో వున్నారు.

### అత్రాఫ్ బల్దా జిల్లాలో అరెస్టులు

అత్రాఫ్‌బల్దాజిల్లా ఘట్కేసర్ గ్రామంలో, సెప్టెంబర్ 25 న రిజర్వుపోలీసులు విశ్వేశ్వరసిద్ధాంతిగారినీ మరి 11 మందినీ అరెస్టుచేశారు. భారత పతాకాలను ఆవిష్కరించడం, అనుమతిలేకుండా బహిరంగసభలలో ఉపన్యసించడంచేసినందుకు ఈ అరెస్టులు జరిగినట్లు తెలిసింది.

# ఓరుగల్లు జైలులోని ఖైదీల ఇబ్బందులు

ఓరుగల్లు, సెప్టెంబరు 26: స్థానిక సెంట్రల్ జైలులోని రాజకీయ ఖైదీలు నానాహింసలకూ గురిఅవుతున్నట్లు తెలుస్తున్నది. చాలామంది ఖైదీలు అతిగ్యత్నరణ(?) సౌకర్యాలు లేనందువల్ల రక్తభేదిమొదలైన జబ్బులలో బాధపడుతున్నారట. సంస్థాన ఆంధ్రకాంగ్రెస్ అధ్యక్షుడు సర్దార్ జమలాపురం కేశవరావుగారికి అస్వస్థతగా వున్నది.

పరకాలలో తీవ్రంగా గాయపడిన వారిని చికిత్స కూడా చేయించకుండా జైలులో వుంచారట.

### సత్యాగ్రహం - అరెస్టులు

### ప్రభుత్వోద్యోగుల రాజీనామాలు

మధిరతాలూకా పెదకోలకొండ పోలీస్ పటేలు శ్రీ ఆదిరాజు రంగారావుగారు నిజాంప్రభుత్వదమన నీతిపట్ల నిరసన తెలుపుతూ తమ ఉద్యోగానికి రాజీనామానిచ్చారు. ఇదే విధంగా గానుగపాడు పట్వారీ శ్రీ కాటూరి కేశవయ్యగారు కూడ తమ ఉద్యోగానికి రాజీనామానిచ్చారు.

బీదరుజిల్లాలోని భాల్కీలో కాంగ్రెస్ అభిమానులైన 25 మందిని, పోలీసులు నిర్బంధించినారు. ఈసందర్భంలో ఒక ఉపాధ్యాయునికూడ పోలీసులు అరెస్టు చేసినారు.

యిల్లెందుకోర్టులో, విచారణకు తీసుకురాబడిన సత్యాగ్రహులు శ్రీ చేర్యాల వెంకన్న, యల్లా ప్రగడ కృష్ణమూర్తి, నరేంద్రుల వారి కోర్టువారావుగార్ల విచారణసందర్భంలో, కోర్టుకువచ్చిన 400 ప్రజలను పోలీసులు కోర్టులో నికిరాని యలేదు. ఈసందర్భంలో కొత్తగూడెంనుండి వచ్చిన రిజర్వుపోలీసులసరంజామా సైనిక విన్యాసాలుచేశారు. ప్రజలు కోర్టు బయట, సత్యాగ్రహులు తిరిగి బయటకు వచ్చిందాకా వేచివుండి వారికిజేజేలర్పించారు.

రిజర్వు పోలీసులు మోతే గ్రామానికి వెళ్లి, కాంగ్రెస్ కార్యకర్తలు కొల్లపు సత్యనారాయణ, బొమ్మ వెంకటేశ్వర్లు, కందిబండ చినవెంకయ్య, సరకంటి భాస్కరయ్యగార్లను అరెస్టు చేసినారు మరికొందరిని నిర్బంధించి విడుదలచేశారు. ఈ గ్రామంలో కాంగ్రెస్ జెండాలు తెలంగవలసిందని వారికి చెందిన వంగపులను హింసించారు. ఒక రోజు వారి నుండి బలవంతంగా కొన్ని నగ్గెరపోలు లను తీసుకున్నారు.

నిరికొండలో, పోలీసులు, చేరాల సూర్యనారాయణ, వెలుదాని వెంకటనారాయణ, నూకల చెన్నారెడ్డి, రామచంద్రారెడ్డిగార్లను నిర్బంధించినారు. కొందరు కార్యకర్తలు పూర్లో లేనందున వారి జాడలు చెప్పవలసిందని, వారి బంధువుల్ని హింసించారు.

హుసేనాబాదులో పోలీసులు కటుకూరి సత్యనారాయణరెడ్డి, వరదు వెంకటరెడ్డి, రేపాల యాదగిరిశాస్త్రి, చెన్న నర్సయ్య, యర్కల రాములు మొదలగు కార్యకర్తలను నిర్బంధించి హింసించినారు.

సూర్యాపేట తహసీల్దారు బజుమార్గ గ్రామానికివచ్చి గ్రామ పంచులను పిలిపించి, గ్రామంలోని పటేలు, పట్వారీ, తమకు గెయ్యకు తిరుగుతున్నారని, సైరుల మండి లేవీ ధాన్యాన్ని వినాలే వసూలుచేసి ప్రభుత్వానికి కట్టాలని హెచ్చరించారు. పైగా వారిని రాటిబెల్లు కట్టవద్దని, కాంగ్రెస్‌లో చేరవద్దని హెచ్చరిస్తూ అవిధంగా చేస్తే జరిమానాలు విధిస్తానని బెదరించారు. కాని ఈ బెదరింపులకు, వారు లొంగలేదు. స్థానిక దేశముఖ్ల గృహంలో నిర్బంధించుకొని వారి గృహంలోకి, పోలీసులు చొచ్చుకొని పోతుండగా, స్త్రీలు లోనికి రావడానికి వీల్లేదని ఎదురుతిరిగారు. దాంతో పోలీసులు ఆ ప్రయత్నం మానుకున్నారు.

సూర్యాపేటలో 19-వ తేదీన సత్యాగ్రహం చేసిన నలుగురిలో యిద్దరిని విడుదల చేసినారు మిగతా యిద్దరికి కోర్టు వారు చెరి ఒకనెల కఠిన శిక్ష, ఐదురూపాయల జరిమానా, జరిమానా చెల్లించని పక్షంలో మరి రెండుమాసాల శిక్ష విధిస్తూ తీర్పు చెప్పినారు.

అత్రాఫుబల్దా జిల్లాలోని హమ్నాబాదులో కాంగ్రెస్ కార్యకర్త శేషయ్య గుప్తగారిని పోలీసులు అరెస్టు చేశారు.

మార్తకల్లులో యస్. గోపాలరెడ్డి గారిని, నాగులపల్లి కొంకరయ్య, ఈరమల్లు చేపూరి నారాయణ, చేపూరి జగదీశ్వరయ్య మొదలగువారిని అరెస్టుచేశారు. వీరిలో యిద్దరిని తరువాత విడుదలచేశారు.

నల్గొండజిల్లా భువనగిరి తాలూకా ధ్యామపురంలో 21 మంది కాంగ్రెస్ కార్యకర్తలను పోలీసులు అరెస్టు చేసినారు. వీరు భారత యూనియన్ పతాకముతో ఊరేగింపుతీసి దానిని సలాంగా ఎగరవేశారు.

దుక్కనూరులో మల్లన్నగౌడు, జాంబయ్య, విఠల్‌రావుగార్లను భారతయూనియన్ పతాకం ఎగరవేసిన కారణంగా అరెస్టుచేసినారు. సుమారు రెండువేల ప్రజాసమూహంముందు, వీరు పతాకాన్ని సలాంగా ఎగరవేశారు.

కుస్తగీలో, ఇద్దరు సామాన్యమైన రైతులు, ప్రభుత్వ నిషేధాజ్ఞలను ఉల్లంఘిస్తూ సత్యాగ్రహం చేశారు. పోలీసులు వారిని అరెస్టు చేసినారు. శ్రీ పూలచంద్, పాండుకంటె జగన్నాధరావుగార్లు ఒక సభలో ఉపన్యసిస్తుండగా, నిర్బంధింపబడినారు

### ఆంధ్రరాష్ట్ర క్రైస్తవ కాంగ్రెస్ అధ్యక్షుని విజ్ఞప్తి

ఆంధ్రరాష్ట్ర క్రైస్తవకాంగ్రెస్ అధ్యక్షుడు డా॥ ఎద్వర్డు మున్నంగిగారు బేతనాపురం(?) చేటుకుంచి ఇలా వ్రాస్తున్నారు:

"నేనిటీవల కర్నూలు, బెజవాడ, చెన్నపట్నం, బెంగళూరు పరిసరాలలో పర్యటనచేస్తిని. అనేక కాందిశీకులతో మాట్లాడించి హృదయము కరుగునంతటి సంగతులు వింటిని. పరారీలోయుండు అనేకులు నేను సి. ఐ. డి. ని అనుకొని నా ప్రశ్నలకు జవాబిచ్చుటకే నిరాకరించుట చూచి, ఎంతటి భయోత్పాతములో యుండిరో తెలిసికొని విచారపడితిని.

అనేక వేల కుటుంబములు ధన, ప్రాణ, మానసష్టములకు భగవంతునిపై భారమిడి పరారీలో కొందరు దాగుకొని, విధిలేక తమ తమ గ్రామాదులలో నే ఆగియుండగా, క్రైస్తవులు, హరిజనులు దుంపనీంద్రదులలోనై, పరారీలోయుండు వారిని వశపరచుకొనుటకు, ఖాళీపడినదుర్గ గదుల భక్తిచేయుటకు, ప్రజలపై కాపిరవము జరుపుటకు తోడ్పడుచున్నారని వినుట విచారకరము.

క్రైస్తవులలో నూటికి 95 గురు ముఖ్యముగా హరిజనులే. గ్రామాదులలో క్రైస్తవులనుటకు హరిజనులనే పిలుచుటున్నారు. గాన హరిజనులకు, క్రైస్తవులను దేశభక్తిలో మనము తీసిపోవువారముకామని, నాగ గొండాల మాటలు విని తప్పుడుత్రోవ త్రొక్కక, మీమీ గ్రామములలోయుండు దేశనాయకుల సలహాల అంగీకరించుచు, ప్రేమ, విశ్వాసము, దేశభక్తి వెల్లడించి జాగ్రత్తగా మెలగవలెనని కోరుచున్నాను.

### కాందిశీకులకు వసతి

హైదరాబాదు కాందిశీక సహాయ సమితికి జెందిన శ్రీ బిట్టా ఆంజనేయులు గారు ఈవిధంగా ప్రకటిస్తున్నారు.

హైదరాబాదు నుండి, ఇండియన్ యూనియన్ ప్రాంతానికి వచ్చిన కాందిశీకుల వసతికై ఆంధ్రదేశమందలి గుంటూరు తాలూకా తాడికొండలో కాందిశీకుల స్థలము ఏర్పాటుచేయడమైనది. కాందిశీకులైన వారు అక్కడికివస్తే తగినవసతి కల్పించబడుతుంది. తాడికొండ గుంటూరు రైల్వే స్టేషన్‌కు 10 మైళ్ల దూరాన యున్నది. గుంటూరునుండి మోటారు సర్వీసుకూడ యున్నది. ఈ ప్రదేశం చాలా ఆరోగ్యవంతమైనది. ఇక్కడ యింతమంది కాందిశీకులు వచ్చిన వసతి కల్పించబడును.

# ట్రూమన్ సంప్రతింపులు

1 వ పేజీ తరువాయి

సమితి సమావేశంనుంచి ఈ గాత్రి వాషింగ్టన్‌కు చేరుకున్నాడు. అమెరికా వాణిజ్యమంత్రి హారిమన్, వ్యవసాయమంత్రి ఆండర్సన్, సహాయ విదేశాంగమంత్రి లావెట్‌లకూడా అక్కడకు వెళ్లిన నారని సారు.

"ప్రపంచ దుర్భిక్షం గత సంవత్సరం కన్నా ఈ ఏడు మరి దారుణంగా వున్నది" అనే సంగతిని ఉద్ఘాటించవలసినదని ఆండర్సన్‌కు ట్రూమన్ సూచించినట్లు తెలుస్తున్నది.

### తేల్చవలసిన అంశాలు

ప్రెసిడెంట్ ట్రూమన్ పదవిని స్వీకరించిన తరవాత ఇన్ని ప్రధానాంశాలు ఎప్పుడూ చర్చకురాలేదు. ఈ క్రింది అంశాలను చర్చిస్తారు.

(1) దారుణమైన ఆకలితోనూ, చలిబాధతోనూ కృశిస్తున్న యూరపియన్ దేశాలకు సాయంచేసేందుకు ప్రభుత్వసంస్థలైన ఎగుమతి దిగుమతులబ్యాంక్, కమ్మాడిటీ క్రెడిట్ కార్పొరేషన్ మొదలైన వాటి ధనాన్ని వినియోగించటం.

(2) దీనికి పార్టీ నాయకులు అంగీకరించకపోతే కాంగ్రెస్ ప్రత్యేక సమావేశాన్ని త్వరలో ఏర్పరచాలని వారు సూచిస్తారా?

(3) ఈ అత్యవసర సహాయంచేసిన తరవాత శాశ్వతసహాయానికై ఏర్పడ్డ మార్షల్ పథకానికి వారు ఆమోదిస్తారా?

(4) విదేశాలకు ఆహారపు ఎగుమతులు తగ్గించకుండా ఉండాలంటే ఒక్క గింజ నుకూడా వృధాగా పోనీయకుండా తగిన చర్యలను తీసుకునేందుకు వారు అంగీకరిస్తారా?

(5) ఇటువంటి స్వచ్ఛంద కార్యక్రమాలవల్ల యొక్కనలాభం లేకపోతే ప్రభుత్వం కొన్ని శాసనాలు చేసేందుకు వారు అంగీకరిస్తారా?

సమావేశం రహస్యంగా జరుగుతుంది.

### మార్షల్ ప్రయత్నాలు

సహాయంచేయకపోతే ఫ్రాన్స్, ఇటలీ మొదలైన దేశాలలో పరిస్థితులు యెట్లా ఉంటాయో వర్ణించి చెప్తాడు. ఐక్యరాజ్య సమితిలో పరిస్థితులను గురించీ, యూరపియన్ రాజకీయాల్లో తమకున్న బాధ్యతను గురించీ మార్షల్ నివేదిస్తాడు. తాత్కాలిక సహాయం విషయమై వివరాలను కూడా మార్షల్ ప్రకటిస్తాడు. బ్రిటన్ కూడా ఫ్రాన్స్, ఇటలీలవలె బాధపడుతున్నప్పటికీ ఫ్రాన్స్ ఇటలీల పరిస్థితికిప్రాధాన్యత్వమివ్వటం ఈ సందర్భంలో గమనించతగ్గది.

# ముస్లిమేతర కాందిశీకులవలస

1-వ పేజీ తరువాయి

పశ్చిమ పంజాబులోని గోజ్రా, ముజఫర్, జారన్‌వాలాలనుంచి సెప్టెంబరు 11 వ తేదీన బయలుదేరిన పెద్ద ముస్లిమేతర శరణార్థి సమూహంలో, యీ 1 లక్ష 25 వేల మంది గనఁట్టు. ఇంకా కాలినడకను వస్తున్న 4 లక్షల మంది బాలూకిహెడ్‌ను అధిగమించి యూనియన్ భూభాగంలో ప్రవేశించాల్సి ఉంది.

షేక్‌పురా, లయల్‌పూర్, మాంట్‌గోమరీ, ఝాంగ్, ముజఫర్‌ఘర్, సర్గోదా, రావల్పిండి, జీలం, గుజ్రాత్, షయాల్‌కోట, గుజ్రన్‌వాలా, డేరాఘాజీఖాన్, మియాన్‌వాలి, పెషావర్ జిల్లాలలో యింకా చాలామంది ముస్లిమేతరులున్నారు. వీరంతా తూర్పు పంజాబుకు ఎప్పుడు వెడతామా అని యెదురుచూస్తున్నారు. ఏజిల్లానుంచి ఎంతమంది ముస్లిమేతరులను భారత యూనియన్‌కు పంపాలో, మిలిటరీ ఇవాక్యుయేషన్ సంస్థవారే నిర్ణయించాలి.

సెప్టెంబర్ 5 తేది లగాయతు, 22 తేది వరకు, తూర్పు పంజాబు నుంచి వెళ్లిన ముస్లిముల సంఖ్యకూడ సుమారు 5 లక్షలుంటుంది. రైళ్లమీద 3 లక్షల మంది, కాలినడకను 78360 మంది, కాలికనడకను, 1 లక్ష మంది ముస్లిములు పడమటికి పంజాబుకు వలసపోయారు.

సెప్టెంబరు 22 నుంచి 23 తేది వరకు మాంట్‌గోమరీ, ఫెరోజ్‌పూర్ జిల్లాలనుంచి సుమారు 14 వేల మంది ముస్లిమేతర శరణార్థులు పాకిస్థాన్ వెంపలపు పంపబడినట్లు, సెప్టెంబర్ 22 తేదీన, 10 వేల మంది ముస్లిమేతరులను, 21 న 4 వేల మంది ముస్లిమేతరులను భవాల్పూర్ సంస్థానం నుంచి తూర్పు పంజాబుకు పంపినట్లు యింకో వార్తను బట్టి తెలుస్తున్నది. సెప్టెంబర్ 18, 19 తేదీలలో 6 వేలమంది ముస్లిమేతరులు షేఖ్‌పురానుంచి తూర్పు పంజాబుకు పంపివేయబడ్డారు.

ముజాఫర్‌నగర్, డింగా, మాండిబహాదీన్ ప్రాంతాలలో చిక్కుపడిపోయిన వారిని దగ్గర పంపించుటకుగాను, సెప్టెంబర్ 16 వ తేదీన కొన్ని బస్సులు వెళ్లాయి.

# చర్చిల్‌కు గాంధిజీ సమాధానం

(1 వ పేజీ తరువాయి)

తర్వాత గాంధిజీ ఉపన్యాసం పత్రికల్లో ప్రకటితమైన చర్చిల్ ఉపన్యాస సారాంశాన్ని చదివి, ఆయన హిందూస్థానీలో పఠిస్తూ(?) తెలియజేసి ఇల్లా అన్నారు.

"చర్చిల్ చాలా గొప్పవాడన్న సంగతి మీకందరికీ తెలుసు. ఆయన దేహంలో పరిశుద్ధమైన ఆంగ్లేయ రక్తం ప్రవహిస్తోంది. ఆంగ్లేయ చరిత్రలో మార్ల్బరో వంశీయులు సుప్రసిద్ధులు ద్వితీయప్రపంచ సంగ్రామం రాబోయే ముందు గ్రేట్ బ్రిటను మహావిపత్తులో నుండగా ఆయన ప్రధాని అయ్యారు. అప్పుడు సామ్రాజ్యం మునగబోయేదాన్ని ఆ మహావిపత్తు నుండి ఆయన నిస్సందేహంగా రక్షించారు. అమెరికా మొదలైన ఇతర మిత్రరాజ్యాల సహాయం లేకపోతే యుద్ధంలో బ్రిటను జయించేది కాదని వాదించటం సమంజసం కాదు. ఆ నైతికమైన చర్చిల్ రాజనీతిజ్ఞత కాకపోతే ఈ రాజ్యాల నన్నిటినీ మరెవ్వరు ఏకం చేశారు? యుద్ధంలో గెలుపొందిన తర్వాత తన మహాజాతికి సముచితంగా ప్రాతినిధ్యం వహించి చర్చిల్ చేసిన మహాసేవను గుర్తించి సర్వత్రా యుద్ధంలో విపరీతంగా ధన ప్రాణాలను కోల్పోయిన బ్రిటిషు దీవులను పునర్నిర్మించడం కోసం స్వచ్ఛమైన కార్మిక ప్రభుత్వానికి అధిపత్యం ఇవ్వడంలో బ్రిటిషుజాతి ఎంతమాత్రమూ వెనుదియ్యలేదు బ్రిటిషుజాతి సందర్భోచితంగా ప్రవర్తించగలిగింది. అందుకనే ముప్పరకేళ్ళలో కూడ గట్టిన సామ్రాజ్యాన్ని ఇచ్ఛాపూర్వకంగా విచ్ఛిన్నంచేసి దానిస్థానే దృశ్యమానం కాకపోయినా దానికంటే అధికంగా మహోజ్వలమైన హృదయ సామ్రాజ్యాన్ని నిర్మించుకోవాలని నిశ్చయించింది. రెండు భాగాలుగా విడగొట్టినప్పటికీ ఇష్టమైతే కామన్వెల్తులో ఉండే పద్ధతిలో భారతదేశం స్వతంత్రమని ప్రకటించటమే ఈ మహానిర్ణయమని నా ఉద్దేశం. ఈ నిర్ణయాన్ని విభిన్న పక్షాలతోకూడిన బ్రిటిషుజాతి అంతాచేసింది. చర్చిలూ ఆయన పక్షం వారు ఇందులో పాల్గొన్నారు. ఈ నిర్ణయం ఔచిత్యాన్ని భవిష్యత్ఫలితాలు బుజువుచేస్తాయా చెయ్యవా అన్నది వేరే విషయం. చర్చిల్, ఈ మహాత్యాగకార్యంలో పాల్గొన్నవాడైయుండి దాని ఔన్నత్యానికి భంగం కలిగించే మాటలనడంగాని, చర్యలు చెయ్యడంగాని ఎంతమాత్రమూ భావ్యంకాదని నా ఉద్దేశ్యం. దీనికీ భవిష్యత్ఫలితాలకూ సంబంధంలేదు. ప్రపంచ నాత్న చరిత్రలో బ్రిటిషువారి అధికారత్యాగంలో పరిపోల్చదగిన సన్నివేశం మరొకటి నిజంగాలేదు తనదగ్గర(?)నున్న మహావైభవాన్ని అనుమాత్రంగా చూచి అశోకచక్రవర్తి చేసిన మహాత్యాగం జ్ఞాపకం వస్తుంది. కాని ఆయనతో ఎవ్వరినీ పోల్చడానికి వీల్లేదు. అదీకాక ఆయన అనుయాత్రన(?) చరిత్రకు సంబంధించినవారు కాదు.

ఆందుచేత రాయిటర్ వార్తా సంస్థ వారు విడుదలచేసిన ఉపన్యాస సారాంశాన్ని చదవవలసి వచ్చినందుకు ఎంతో విచారించాను. ప్రసిద్ధికెక్కిన ఆవార్తాసంస్థ ఆయన అభిప్రాయాలను వికృతంగా ప్రదర్శించలేదని నేను నమ్ముతున్నాను. స్వజాతికి మహాసేవచేసిన చర్చిల్ ఈ నాడు అజాతికే మహాపకారంచేశాడు. బ్రిటిషు బంధనాలనుండి విడివడినంతలోనే భారతదేశం పొందబోయే దుస్థితి ఆయనకుముందే తెలిసివుంటే నానికంటినా సామ్రాజ్యనిర్మాతలే కారకులు గాని. ఆయనదృష్టిలోనే మహోన్నత సంస్కృతి నిర్మాణదక్షులైన 'భిన్నజాతులు' ఎంతమాత్రమూ కొరగానివని తాము వెనక చేసిన పనులనే పర్యాలోచించి తమకర్మ తాము తెలుసుకోవడానికి అణుమాత్రమైనా ఎందుకు ప్రయత్నించలేదు? చర్చిల్ అనవసరంగా తొందరపడి ఈ విమర్శచేశారని నా ఉద్దేశం. కోటానుకోట్ల భారత ప్రజలలో మతవిద్వేషాగ్నికి గురిఅయి ఈ నాడు ఉన్మత్తులైన కొద్ది లక్షలమంది ఒక లెక్కలోకిరారు. చర్చిల్ భారతదేశానికి వచ్చి, ముందే స్థిరపడి పూర్వాభిప్రాయాలతోకూడిన పాక్షిక వ్యక్తిగా కాక, అన్నింటికంటే ఎక్కువగా గౌరవాన్ని అనుభవించే నిష్పాక్షికమైన బుజువర్తనగల ఆంగ్లేయునిగావచ్చి ఇక్కడి యథార్థ పరిస్థితులు తెలుసుకోవాలని స్నేహంతో ఆహ్వానిస్తున్నాను. అయితే ఆయనవచ్చేటప్పుడు బ్రిటిషుజాతి మహా దార్శకార్యానికి ఉజ్వల విజయం సాధించాలన్న దృష్టితో రావాలి. గ్రేటు బ్రిటను చేసిన ఈ నిరుపమాన నిర్ణయం దానివల్ల రాబోయే ఫలితాలనుప్పు పరీక్షింపబడుతుంది. భారతదేశ చరిత్రను రెండు భాగాలుగా విభజించడంవల్ల అనుకోకుండానే ఉత్పన్నమైన యిజానికి ఆహ్వానించినట్లయింది. సోదరాధిపతులుగా రెంటికీ స్వాతంత్ర్యమివ్వటం బ్రిటిషు జాతి దానాన్ని కళంకితం చేసిందేమో!

### నిరాధారమని బుజువుచెయ్యండి

బ్రిటిషు కామన్వెల్తులోనుండి ఏ అధినివేశమైనా ఇష్టమొచ్చినప్పుడు విడిపోవచ్చునని ఊరికే అనడంవల్ల లాభంలేదు చెయ్యడంకంటె చెప్పడం చాలాతేలిక. చర్చిల్ మరింత జాగ్రత్తగా మాటాడితే బాగుండునని నే నాదుకున్నాను. బుజువు చెయ్యడానికి చాలా చెప్పేను. యథార్థ పరిస్థితులను ప్రత్యక్షంగా తెలుసుకోకముందే ఆయన ఈయన చర్చల్లో తనతో పాల్గొన్న ఇతర పక్షాలవారిని ఈ విమర్శలో నిందించాడు. చర్చిల్‌కు ఈ అవకాశం కలగడానికి ఇక్కడి శ్రోతలలో అనేకులు కారణమని నేను చెప్పకతప్పదు. ఇప్పటికైనా మునిగిపోయిందేమీలేదు. ప్రజలందరూ తాము ఆవలంబిస్తున్న విధానాలను మార్చుకొని చర్చిల్ ఊహలు కేవలం నిరాధారమని బుజువు చెయ్యవచ్చు. నా యీ ఉద్బోధ యూతలూ పట్టకంతకోవ. అనీ, అరణ్యరోదనమనీ నాకు తెలుసు. అంతే కాకపోయినట్లయితే, స్వాతంత్ర్య ప్రస్తావన మనదేశం తీరీరోజుల్లో నా మాటలకు ఉండిన వటువ్యం ఈ నాడు నూ దారున్నట్లయితే, గోరంతలు కొండంతలు చేసి చర్చిల్ విమర్శించిన ఈ ఈ దౌర్జన్యాలకు ఎక్కడా అవకాశం ఉండేదే కాదు. అంతరంగికఁ స్వర్శాలనూ, ఆర్థిక సమస్యలనూ పరిష్కరించుకోవడం కోసం భారత జాతి యంతా సక్రమమైన అభ్యుదయ మార్గంలో పురోగమిస్తూ ఉండేది."

ప్రార్థనానంతరం గాంధిజీ మామూలుగా ప్రతివారమూ పత్రికలమధ్య ఉపన్యసించారు. చర్చిల్ ప్రసంగం నిన్నటి 'ఆంధ్ర పత్రిక' లో ప్రకటించబడింది.)

ఆ ఉపన్యాసములో చర్చిల్ ఈ విధముగా చెప్పినారు:

"భారతదేశంలో భయంకరంగా జరుగుతున్న జనసంహారము నన్ను ఆశ్చర్యపరచలేదు.

"ఉన్నతమైన సాంస్కృతికములై తరతరములుగా, నిష్పాక్షికము, స్వేచ్ఛా పూరితము, నిరాడంబరమగల బ్రిటిషు సామ్రాజ్యాధిపత్యమున శాంతియుతముగా ఒకరి ప్రక్కన ఒకరు జీవించిన ఆ రెండు జాతులు పరస్పర క్రూరత్వముతో జరుపు కొను భీతావహక సాంఘిక కృత్యములవి ఇది ప్రారంభమేనుమా! గత 60, 70 సం॥ నుండి ప్రపంచములో అతి ప్రశాంతమైన ఆభూభాగంలో జనాభా చాలవరకు తగ్గిపోయి, ఆసియా ఖండములో కనీ, వినీ ఎరుగనంతటి వ్యాధుల కరముగా ఆ విశాల ప్రాంతములలో నాగరికత క్షీణించిపోగల దనటలో నాకు సందేహములేదు."

### 'భాషా ప్రయుక్తరాష్ట్రాలు రావాలి'

#### ఉత్తర మేడూరులో

#### కళా వెంకట్రావుగారి ప్రసంగం

చెన్నపట్నం, సెప్టెంబరు 29: "భాషా ప్రయుక్తరాష్ట్రాలు వచ్చినగాని స్వరాజ్యము సార్థకముగాదు. ప్రజలు తమ పరిపాలనను తమభాషలో జరుపుకొనినగాని వారి కష్టనిష్ఠురములు తీరగలవు. లేనిచో స్వరాజ్యము నిరర్థకమే" అని మద్రాసు ప్రభుత్వ రెవిన్యూమంత్రి శ్రీ కళా వెంకట్రావుగారు నిన్న సాయంత్రం ఉత్తరమేడూరులో రాజాజీ యువజనసంఘ ప్రారంభోత్సవమును జరుపుచూ చెప్పిరి. స్థానిక సాయమంత్రి కె. మాధవమీనన్ గారు జాతీయపతాకము నెగురవైచిరి.

మంత్రులిద్దరికి స్వాగతమును గ్రామస్థులిచ్చిరి జమీందారీరద్దు బిల్లు తెచ్చుచున్నందుకు రెవిన్యూ మంత్రిగారిని అభినందించిరి.

శ్రీ కళా వెంకట్రావుగారు జమీందారీ రద్దుబిల్లు శాసనమై అమలుకు వచ్చుటకై రెండుమూడు మాసములు పట్టుననియు, తర్వాత రైత్వారీ శాసనమునుగూడా తేగలమనియుచెప్పిరి. అహింసాత్మకమైన పోరాటముద్వారా సాధించిన స్వరాజ్యము నిలుపుకొనుటలో గొప్పబాధ్యతయున్నదనియు యువకులపై హెచ్చు ఈ భారము ఉన్నదనియు తెలిపిరి.

ఒ. వి. అలగేశన్ గారు స్వాగతపత్రము, చెంగల్పట్టు పబ్లిక్ ప్రాసిక్యూటర రాజాజీచిత్రమును, కలెక్టరు వెంకటేశ్వరన్ గారు గాంధీజీచిత్రమును ఆవిష్కరించిరి.

రెవిన్యూమంత్రిగారు తెరచిన పెంకె తాళమునకు వేలములో రూ 61 లు వచ్చెను. దానిని ఆ సంఘమునకు ఇచ్చివేసిరి.

# భారతీయుల పట్ల ఐక్యరాజ్య సమితి పక్షపాతం

## తగినన్ని ఉద్యోగాలు భారతీయులకివ్వలేదని పిళ్లై ఫిర్యాదు

### బడ్జెట్ అంచనాలో 60 లక్షల డాలర్లు తగ్గించాలని సూచన

లేక్‌సక్సెస్ (న్యూయార్క్), సెప్టెంబర్ 28: ఐక్యరాజ్య సమితి బడ్జెట్ మొత్తంలో 60 లక్షల డాలర్లు తగ్గించాలని సూచిస్తూ సమితి కార్యాలయంలో భారతీయులకు న్యాయంగా యివ్వవలసినన్ని ఉద్యోగాలు యివ్వలేదని, భారత ప్రతినిధి పిళ్లై నిన్న బడ్జెట్‌నిర్మాణ సంఘ సమావేశంలో ఫిర్యాదు చేశాడు.

సమితి ప్రధానకార్యదర్శి ట్రిగ్వేలీ అంచనా వేసిన 3 కోట్ల 40 లక్షల డాలర్ల బడ్జెట్, 2 కోట్ల 80 లక్షల డాలర్లకు తగ్గించాలని, అసలు యీ బడ్జెట్ మొత్తాన్ని 3 కోట్ల డాలర్లకు తగ్గించాలని, బ్రిటన్, రష్యాలు యిదివరకే సూచించాయని, బడ్జెట్ నిర్మాణసంఘానికి పిళ్లై తెలియజేశాడు.

సభ్యరాజ్యాల ఆర్థికపరిస్థితినిబట్టి బడ్జెట్ నిర్మాణసంఘం ప్రత్యేకంగా గమనించాలని, యుద్ధానంతర ప్రపంచంలో ప్రతిదేశమూ పునర్నిర్మాణానికి సంబంధించిన క్లిష్ట సమస్యల నెన్నో ఎదుర్కోవలసి వచ్చిందనీ, డాలర్ల కొరవవలన తీవ్రకొరత యేర్పడి యీ నాడు ప్రపంచ రాజ్యాలకు దుస్సహమౌతోందని పిళ్లై అన్నాడు.

సమితి కార్యాలయంలో ఉన్న 4 వేల మంది ఉద్యోగుల విషయాన్ని పురస్కరించుకొని పిళ్లై యిలా వ్యాఖ్యానించాడు.

"ఈ సమితి కార్యాలయంలో భారతీయులకు ఉద్యోగాలిచ్చే విషయంలో చాలా అన్యాయం జరిగింది. ఐక్యరాజ్య సమితికి వచ్చే ఆదాయంలో, నూటికి 4 వంతు భారతదేశం చెల్లిస్తుంది. ఈ ప్రకారంచూచినా, సమితి కార్యాలయంలోని ఉన్నతోద్యోగాలలో నూటికి నాల్గువంతులు భారతీయులకు రావాలి.

ఇక తక్కువతరగతి ఉద్యోగాల విషయంమాటిటా, కార్యాలయంలో మొత్తం 10 మంది భారతీయులేవున్నారు. న్యాయంగా యీ సంఖ్య పదింతలు పెరగాలి.

ఉన్నతపదవులలో, అంటే, సహాయ కార్యదర్శి, డైరక్టర్ మున్నగు, వాటిలో ఒక్క భారతీయుడుగూడా లేడు ఇది పైకి చాలా స్వల్పవిషయంగానే కనిపించినా, ఐక్యరాజ్యసమితి, వివిధ ప్రపంచ దేశాల ప్రయోజనాలదృష్ట్యాచూస్తే ప్రధాన విషయమే.

### లాంగ్‌స్టాఫ్ మరణించలేదు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 28. పాకిస్థానులోని కొహిమార్వద్ద మహమ్మదీయేతర కాందిశీకులు ప్రయాణంచేస్తున్న రైలును ముట్టడించిన దుర్మార్గులను తరుముతూ కంటనా(?) బ్రిటిషు సైనికోద్యోగి మేజర్ లాంగ్‌స్టాఫ్ చనిపోయాడన్న వార్త నిరాధారమనీ, ఆయన ఏవిధమైన అపాయములేకుండా సురక్షితంగా ఉన్నాడనీ ఇప్పుడే అందిన సైనికాధికారుల నివేదికనుబట్టి తెలుస్తున్నది."

### సురవర్ధీ గారు

ఢిల్లీ, సెప్టెంబరు 28. ఈ రోజు మధ్యాహ్నము విమానములో సుహ్రవర్ది కలకత్తా వెళ్లిపోయినాడు.

# బ్రిటన్ మధ్యవర్తిత్వం

[1 వ పేజీ తరువాయి]

గా చేతులు ముడుచుకొని ఊరకుండాలని అర్థంగాదు. భారతదేశంలో జరుగుతున్న ఘోరహింసాకాండపట్ల వ్యక్తమయ్యే విషాదం వాస్తవికమైనదే ఈ విషాద సంఘటనలకు మన కేమీ బాధ్యతలేదని అనుకోవడానికి వీలులేదు. భారతదేశంనుంచి సైన్యాలను ఉపసంహరించటం ఉత్తమ విధానమే. కాని అధికారదత్తత, పంజాబురాష్ట్ర విభజన వీటిని అనుసరించి జరిగిన, మిలిటరీ, పరిపాలనా బాధ్యతల పంపకం విషయంలో బ్రిటన్ తప్పటడుగు వేయలేదా?

"కాశ్మీరు యిదివరకు జరిగిన తప్పులను సరిదిద్దుకోడానికి మధ్యవర్తిత్వమే పరిష్కార మార్గంగా కన్పిస్తోంది ఇండియా పాకిస్థాన్‌లు తమ సమస్యలను తమంతతామే పరిష్కరించుకోలేకపోతే ఉభయ అధినివేశాలు మధ్యవర్తిత్వానికి ఒప్పుకోవాలని గాంధీజీ అన్నారు ఇండియా పాకిస్థాన్‌ల మధ్య యుద్ధమే శరణ్యమంటూ, మొన్న శుక్రవారంనాడు అనాలోచితంగా, ఉద్రిక్త ప్రకటన నొకదాన్ని గాంధీజీచేశాడు మధ్యవర్తిత్వానికి పాకిస్థాన్ ఒప్పుకోవడం లేదన్నట్లు గాంధీ సూచించాడు.

"మధ్యవర్తిత్వానికి ఉభయ అధినివేశాలు అంగీకరించటంలో, ఉభయదేశాలు అంగీకరించే, ప్రఖ్యాత కామన్వెల్తు రాజకీయవేత్త యొకడు ఢిల్లీ, కరాచీనగరాలకు వెళ్లాలి అక్కడి స్థితిని పరిశీలించి, ఉభయప్రభుత్వాలతోను చర్చించితగిన తీర్మానాలు చేయడమే యీ రాజకీయ వేత్త నిర్వహించాల్సిన పని. ఇంత విషమఘట్టంలోనైనా సరే, ఉభయ అధినివేశాలు మరింత ఎడమైపోకుండా, చతురతగల రాజకీయవేత్త నివారించగల అవకాశం ఉంది

# ఈజిప్టులో వామపక్ష ప్రాబల్యం

కెయిరో, సెప్టెంబర్ 28: తనజాతీయోద్యోగాలను సఫలం చేసుకోలేకపోయిన ఈజిప్టు నిమ్మళమై ఉన్నదని పైకి కనపడ్డప్పటికీ, సూక్ష్మంగా పరిశీలించే వారికి అక్కడ ప్రబలుతున్న వర్గవైషమ్యం కనపడుతుంది. ఈ విషయం అక్కడ ఈమధ్య ఎక్కువగా జరుగుతున్న సమ్మెలవల్ల ద్యోతకం అవుతున్నది.

కాని ఈ సమ్మెలకు ప్రోత్సాహం కమ్యూనిస్టులదగ్గరనుండి కాకుండా, ఈ మధ్యనే కొత్తగా ఏర్పడ్డ కార్మికపక్షం ద్వారా వస్తున్నది. దీని ప్రోత్సాహకుడు అబ్బాస్ హలీం ఫరూక్‌రాజుకు దగ్గరి జ్ఞాతి. దీని అధ్యక్షుడు సాలేహా బే హాషా అతివాదపక్షమైన 'ముస్లింయువజనసంఘానికి' కూడా నాయకుడు.

కొన్ని నెలకిందట దేశంలో వర్గకలహాలు సంభవించవచ్చునని పార్లమెంటులో హెచ్చరిక చేయబడ్డది. ధనవంతులకూ, లక్షలకొలది వున్న కార్మికులకూ వున్న వ్యత్యాసాలను తొలగించవంతవరకూ ఈ ప్రమాదం ఉండక తప్పదు.

"పెట్టుబడిదారుల ప్రమాదం అంతకంటే ఎక్కువై పోతున్నది. ప్రభుత్వం ఈ ప్రమాదాన్ని పరిగణించటంలేదు." అని అబ్బాస్‌హలీం చాలసార్లు ప్రబోధిస్తున్నాడు.

"మూడు సంవత్సరాల్లో ఈ పరిస్థితులు మారకపోతే ఈ ప్రభుత్వం కూలిపోయి అరాజకం ఏర్పడుతుంది." అని అతడు ప్రకటించాడు.

ఈ సమ్మెలలో బడి పంతులుకూడా పాల్గొంటున్నారు.

ఈజిప్టు వామపక్షంవైపు మొగ్గి మధ్య ప్రాచ్యంలోని అరబ్ దేశాలను మధ్యయుగం నాటి జమీందారీ విధానం నుంచి తప్పించే అవకాశంకూడా వున్నది.

## విజయనగరం మ్యునిసిపల్ ఎన్నికలు

### రంగాగారి ప్రచారం

విజయనగరం, సెప్టెంబరు 27: మ్యునిసిపలు ఎన్నికల ప్రచారము నిమిత్తమున్ను ఆహారధాన్య సేకరణ నిమిత్తమును యన్. జి. రంగారు నిన్న షెడ్యూలులో 2 జయనగరం విచ్చేసిరి. టవునుహాలులో జరిగిన బహిరంగసభయందు ఉపన్యసించుచు ఇట్లు చెప్పిరి.

వోటరులందరు కాంగ్రెసు అభ్యర్థులకే తమ వోట్లను యివ్వవలెను. కాంగ్రెసు యెడల ప్రజలకు గల అభిమానం నిర్ధారమూ.

నిన్న జిల్లా కాంగ్రెసు కార్యకర్తల సమావేశంలో ఉపన్యసిస్తూ రంగాగారు ధాన్యసేకరణ విషయములో అందరూ సహాయము చేయవలెనని కోరిరి. దేశములో క్షామమును తొలగించవలెనని చెప్పిరి రాత్రి చాలా ప్రొద్దుపోయిన పిమ్మట సభ ముగిసినది.

రంగాగారు నేడు ఉదయము రైలుమీద చీకాకోలం వెళ్లిరి.

## యన్. జి. రంగాగారి అనంతపురంలో సంచారం

అనంతపురం, సెప్టెంబరు 21. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులు ఆచార్య రంగాగారు తమ రాయలసీమ పంచారంలో నేటి ఉదయం అనంతపురం వచ్చిరి. స్టేషనులో జిల్లా కాంగ్రెస్, కిసాన్ కాంగ్రెసు నాయకులు ప్రముఖులైన కార్యకర్తలు వారికి స్వాగతమిచ్చిరి.

సాయంత్రం 8 గంటలకు పీస్ మెమోరియలు హాలులో జిల్లా కాంగ్రెసు, కిసాన్ కాంగ్రెసు కార్యకర్త సమావేశం జరిగినది. జిల్లాలోని వివిధ ప్రాంతములనుండి దాదాపు 500 మంది కార్యకర్తలు హాజరైరి. కాంగ్రెసుయొక్క భవిష్యత్కార్యక్రమమును గూర్చి రంగాగారు యిలా ఉపన్యసించిరి.

స్వాతంత్ర్య సంపాదనా కార్యం ముగిసినది గనుక భారతప్రజానీకానికి యేవిధముగా యిక ముందు కాంగ్రెసు సేవచేయ దలంచినదో వివరించుచు ఇటీవల శ్రీ శంకరరావుదేవుగారు చేసిన ప్రకటన చాలా ఉత్సాహజనకముగా నున్నది. రైతులు, కూలీలు, సామాన్యప్రజలయొక్క సాంఘిక ఆర్థిక అభివృద్ధికై యికముందు కృషి చేయగలదని శ్రీ శంకరరావు దేవుగారు ప్రకటించిరి. ఇది చాలా సంతోషదాయకం. కాంగ్రెసు సంకల్పించిన యీ నిర్మాణ కార్యక్రమమునుగూర్చి వివిధ రాష్ట్ర కాంగ్రెసు సంఘముల అధ్యక్షులు యీమధ్య ఢిల్లీలో సమావేశమై నిర్ణయించిరి. అదియే శంకరరావు దేవుగారి ప్రకటన కనుక రైతులు, కూలీలు, సామాన్యప్రజలు కాంగ్రెసులో చేరి కాంగ్రెసులో తమబలమును పలుకుబడిని వృద్ధి చేసికొని కాంగ్రెసును తమ అభివృద్ధికై ఉపయోగపరచుకోవలెను.

మైనర్ యిరిగేషను ప్రాజెక్టులను పెద్ద పెద్ద ప్రాజెక్టులను ప్రభుత్వం పూనుకొని సాగించుటలేదని రైతులు వాదించుచున్నారు. ఇంజనీర్లు ఆ ప్రాజెక్టుల పరిశీలన యెడలను కార్యక్రమములను తయారు చేసి యివ్వలేదనుసాకుతో మన ప్రస్తుత రాష్ట్ర ప్రభుత్వం యీ వ్యవహార నిర్వహణమును వాయిదా వేయుచున్నమాట నిజమే. అందువల్ల రైతులే తమంతట సమర్థులైన వారిద్వారా ఆయా ప్రాజెక్టుల ప్లానులు ప్రింటును ముందు ఫులను తయారుచేసి ప్రభుత్వమునకు దాఖలుచేసినయెడల, అవి సక్రమంగా లేవని తుంటిసాకులను చెప్పుటతో కాలహరణం చేయుటకు అవకాశం ఉండదు.

మతకలహాలు చెలరేగుచున్న యీ దినములలో ప్రజానీకాన్ని దుండగీండ్ర దాడినుండి రక్షించుటకు ప్రతిగ్రామంలోను "కాంగ్రెసు సేవాదళము"లు ఏర్పాటు చేసి గ్రామ యువకులకు శిక్షణ చేయవలెను.

### రాయలసీమకు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసుశాఖా కార్యాలయం

రాయలసీమ తాలూకు 5 జిల్లాలకు గుంతకల్లు సౌకర్యంగా ఉంటుందిగనుక, గుంతకల్లులో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘ ప్రాంతీయ ఏర్పాటుచేయ నిశ్చయించితిమి. ఇచ్చట భవననిర్మాణమునకు సుమారు రూ 15,000 ఖర్చు ఔను. దానిని రాయలసీమ కాంగ్రెసు సేవకులు విరాళములు వసూలు చేసి ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘమునకు అందజేయవలసినదిగా కోరుచున్నాను.

అనంతపురం జిల్లాలో రాగులకు బస్తా 1 కి రూ 18 లు ధర యివ్వబడుచున్నది. కాని దాని ప్రక్క జిల్లాలలో రూ 18 లు ధర యివ్వబడుచున్నది. అందువల్ల జిల్లా సరిహద్దు ప్రాంతాలలో దొంగరవాణా, బ్లాకు మార్కెటింగు జరుగుచున్నది. ఈ విధంగా ప్రభుత్వము అనంతపురం జిల్లా రైతులకు చాలా అన్యాయము చేసినది. కనుక వెంటనే అనంతపురం జిల్లాలో బాకీ పోయిన జిల్లాలలోవలె రాగులకు ... పెంచవలెను. ఆట్టి ధర కనీసం రూ 20 లు ఉండాలి. అని రైతులు తమ వినతిపత్రములలో కోరిరి. ఇది రాష్ట్ర ప్రభుత్వం చేయవలసిన సర్దుబాటు. కనుక, అందుకు కావలసిన సహాయం చేసను చేస్తాను.

రాయలసీమ జిల్లాలవారికి సర్కారు జిల్లాలవారు అన్యాయం చేశారనే వాదన యిటీవల బయలుదేరింది. రాయలసీమవారికి అపకారం చేయగల అధికారం సర్కారు జిల్లాలవారి చేతులలో ఎప్పుడూ లేదు. మీరు మొక్కలి సర్కారులున్నూ, రాయలసీమయున్నూ మరొక ప్రాంతంవారి పెత్తనం ... అందువల్ల ఉభయులు కష్టనష్టాలు అనుభవించుచున్నారు.

సాయంత్రం 7 గంటలకు గంగయ్య నాయుడుగారి అధ్యక్షతన మ్యాంటు మైదానములో బహిరంగసభ జరిగినది. ఆ సభలో ఉపన్యసిస్తూ రంగాగారు యిలా అన్నారు.

మనదేశం స్వాతంత్ర్యం పొందినప్పటికీ స్వదేశ సంస్థానాలు ఇంకా నలిగి యుండుట ఎంతో విచారకరం. రాజ్యాంగం అంటే ఏమిటో తెలియని మైసూరు మహారాజా గారు బయటనుండి కొనుక్కొని తెచ్చుకున్న ప్రధానితో పరిపాలన సాగిస్తూ ప్రజలకు స్వాతంత్ర్యం యివ్వకపోవటం కిస్తు చేటు. మైసూరు సంస్థాన ప్రజోద్యమమునకు మనము చేయూతనొసంగవలెను. మన యువకులు జట్టు జట్టుగా మైసూరు వెళ్ళి ఆట్టి పోరాటంలో పాల్గొనవలెను.

నైజాములో ముసల్మానులు నూటికి 15 మంది మాత్రమే. నూటికి 85 మంది హిందువులు అల్పస్థితిలో యీ సొద్దు ... మహమ్మదీయులకు అధికసంఖ్యాకులైన హిందువులతో బాటు నిజాంప్రభుత్వంలో సమాన ప్రాతినిధ్యం ఏర్పాటుచేస్తారట, అచటి ప్రజలు సాగించుచున్న పోరాటమునకు మనము ధనం సహాయం చేయాలి. మన యువకులు నిజాము రాష్ట్రమునకు వెళ్లి వారి యుద్యమమునకు తోడ్పాటు నివ్వవలెను.

అటుపిమ్మట సభలో కల్లూరి సుబ్బారావుగారు కల్లూరు రామస్వామయ్యలగారు ఉపన్యసించిరి.

## 'సత్యాగ్రహదినోత్సవం'

### అక్టోబరు 1 న జరపాలి

#### మైసూరు సత్యాగ్రహ సంఘ కార్యదర్శి ప్రకటన

హుబ్లీ, సెప్టెంబరు 28: మైసూరు సంస్థానం అంతటా అక్టోబర్ 1 తేదీ సత్యాగ్రహదినోత్సవం జరపాలని సత్యాగ్రహ సంఘ కార్యదర్శి ప్రకటించారు. సంస్థాన కాంగ్రెస్ సత్యాగ్రహం ప్రారంభించి నెలరోజులైంది. కనుక ఆగుర్తుగా ఆ రోజున అన్ని చోట్లా నిర్బంధాలను ఉల్లంఘించి ప్రభాత భేరీలూ, ఊరేగింపులూ, బహిరంగసభలూ జరపాలనీ సభలలో మహారాజావారు ఇటీవలచేసిన ప్రకటనపై ప్రజాభిప్రాయం వెల్లడించాలనీ కార్యదర్శిగారు ప్రకటించారు.

### కాంగ్రెస్ నాయకుల విడుదలకై ప్రతీక్ష

రాజ్యాంగసంస్కరణల విషయమై మహారాజుగారు ప్రొక్లమేషను గావించి యుండుట చేత మైసూరు రాజకీయ వాతావరణము కాంగ్రెస్ నాయకుల విడుదల పతీక్షతో క్షుభించి యున్నది. గురువారము నాటి పత్రికా ప్రతినిధుల సభలో యింగువిషయమై దివాను నిశ్చితముగా యేమియు చెప్పక పోయినప్పటికి ఈ మాసాంతము లోపుగా కాంగ్రెస్ నాయకుల విడుదల జరుగునని రాజకీయ వర్గములవారు ఆశించు చున్నారు.

### సత్యాగ్రహుల విడుదల

ఇది యిట్లుండ, సత్యాగ్రహ కార్యకలాపములు రాజధానిలోను, జిల్లాలలోను శాంతియుతముగా జరుగుచున్నవి. నిన్న కృష్ణరాజపురం తాత్కాలిక జైలు నుండి 48 గురు సత్యాగ్రహులు విడుదల కాబడిరి.

### సంస్థానములో అత్యంత విషమ ఆహార పరిస్థితి

బెంగుళూరు, సెప్టెంబరు 27: 6 లక్షల జనాభాగల బెంగుళూరు నగరములో ఈ వారాంతముతో ఆహార ధాన్యముల నిలువలు ఖాళీయైనవి. రేపు వచ్చునని అనుకొనుచున్న సరుకుపై ఆశలు పెట్టుకొని యున్నారు. మరే ఆశాలేదు. బెంగుళూరు మైసూరులలో అత్యంత విషమస్థితి యేర్పడినదని మైసూరు ఆహారశాఖవారిని విచారింపగా తెలిసినది. కోలారు బంగారు గనులలో ప్రస్తుతము తగినంత ధాన్యము నిలువ యున్నది. బెంగుళూరు పరిస్థితి చాలా అధ్వాన్నముగా నున్నది. రేపు కొంత సరుకు వచ్చునని అనుకొనుచున్నారు. రేషనింగు విధానము భగ్నమగునను భయము నిజ తగ్గించగలేను. మైసూరు రైల్వే సమ్మెవల్ల ఆహారధాన్యముల సరఫరాకు తీరని అంతరాయము కలిగినది. అందువల్ల గ్రామసీమలలో పంపకము అసమానముగా నున్నది. (అ. ప్రె.)

## మహాత్ముని జన్మదినం:

### మైసూరుప్రభుత్వ ప్రకటన

బెంగుళూరు, సెప్టెంబరు 27: గాంధి మహాత్ముని జన్మదినమగు అక్టోబరు 2 తేదీ సెలవుదినమని మైసూరు ప్రభుత్వమువారు ప్రకటించిరి. అధికారరీత్యా మైసూరు ప్రభుత్వమువారు మహాత్ముని జన్మదినము సెలవుదినముగా ప్రకటించుట కిదియే మొదటిసారి.

















## డిస్పోజల్సు

రీజయనల్ కమిషనర్ (డిస్పోజల్సు) సివిల్ లైన్సు, కాన్పూరువారి ఆర్డరుల ప్రకారము క్రింద విధముగా వేలము అమ్మకములు జరుగును. అమ్మకపు షరతులగురించిన పూర్తివివరములు వేలము సమయములో తెలుపబడును. ఈక్రింది మొత్తములు సుమారుగా నీయబడినవి అవసరమైనచో స్టోరులు వేలమునుండి మినహాయింపబడవచ్చును. అమలులో నున్నచోట అక్ట్రాయి లేక టర్మినల్ పన్నులు విధించుటకు లోబడి స్టోరుల అమ్మకము జరుగును.

| వేలము జరుగు స్థలము. | వేలము సమయము. | వేలముదారులు. |
|---|---|---|
| ఎయిర్ క్రాఫ్టు కార్స్ యార్డు డిపో, చకేరి. | 3-10-1947 శుక్రవారము ఉదయము 9-30 గంటలకు | మెసరు పి. స్టాన్లీ అండ్ కో., |

స్టోరులు: క్రింద చూపబడిన విధముగా వున్న పనిచేయని 200 ఎయిర్ క్రాఫ్టులు

| | | | |
|---|---|---|---|
| లిబరేటర్లు: | 4 ఇంజనులతో | 4 ప్రాపెల్లరులతో | 118 |
| ,, | 4 ఇంజనులతో | 2 ప్రాపెల్లరులతో | 4 |
| ,, | 4 ఇంజనులతో | 1 ప్రాపెల్లరుతో | 2 |
| ,, | 4 ఇంజనులతో | ప్రాపెల్లరులు లేనివి | 65 |
| ,, | 4 ఇంజనులతో | 4 ప్రాపెల్లరులతో (ప్యాసంజరు రైపువి) | 12 |
| వార్విక్ | 2 ఇంజనులు | 2 ప్రాపెల్లరులు (లూస్) | 1 |
| హార్వర్డ్ | 1 ఇంజను | 2 ప్రాపెల్లరులు (కాయ్యవి) | 1 |
| హార్వర్డ్ | 1 ఇంజను | ప్రాపెల్లరులు లేకుండా | 1 |
| బ్యూఫైటర్ | 2 ఇంజనులు | 2 ప్రాపెల్లరులు | 1 |

| | | |
|---|---|---|
| ఎం. టి. అండ్ ఎయిర్ క్రాఫ్టు కార్స్ యార్డు డిపో, బ్రమ్రోలి. | 7-10-47 తేదీ మంగళవారము ఉదయము 9-30 గంటలకు. | మెసర్సు ఎం. జి. కావర్ & కో., |

స్టోరులు: క్రింద చూపబడిన విధముగా వున్న పనిచేయని 261 ఎయిర్ క్రాఫ్టులు

78 బ్యూఫైటర్లు (దూర్గరల్ బాడీలతోను, 154 లేసియర్ టైపు ఇంజనులు) 47 థండర్ బోల్టులు, 1 వెంజెన్సు, 64 మస్కిట్లు, 2 స్పిట్ ఫైరులు, 3 ఆస్టర్లు, అనేకరకములలో 66 ఇతరములునవి.

రీజియనల్ కమిషనర్ (డిస్పోజల్సు)
సివిల్ లైన్సు, కాన్పూరు.

